గండికోట శ్రీవైష్ణవ గ్రంథమాలా నెం. 14 

శ్రీయైనమః

శ్రీమన్నిగమాంత మహాదేశిక విరచితంబులగు

3౨ రహస్య గ్రంథములలో

పదునాల్గవదియగు

# రహస్యరత్నావళీహృదయము.

ఇయ్యది

కావ్యరత్న వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి

ఇత్యాది బిరుదాంకితులగు

## కందాడై శేషాచార్యులవారిచే

ఆంధ్రీకరింపబడి

స్వకీయ

**వేదాంతముద్రాక్షరశాలయందు**

ముద్రింపించి ప్రచురింపబడినది.

**Madras.**

**1929.**

Rs. 1-8-0.)  (వెల 1-8-0

తా॥ కర్మపరిపాకమువలనఁ గలిగినదియగుటంజేసి చతుర్ముఖబ్రహ్మలోకమువరకును అంతయు నశుంగళంబని తలంచుకొని విరక్తులైనట్టి వారికి వాసుదేవుండే పరమగతి.

శ్లో॥ యేచవేద విదోవిప్రాః యేచాధ్యాత్మవిదోజనాః।
తేవదంతిమహాత్మానం కృష్ణం ధర్మంసనాతనం॥

తా॥ వేద వేదాంత వేత్తలగు బ్రాహ్మణులు శ్రీకృష్ణుని సనాతన ధర్మమునుగాఁ జెప్పుచున్నారు.

శ్లో॥ అమృతం సాధనం సాధ్యం తం పశ్యన్తి మనీషిణః।
యజ్ఞాఖ్యం పరమాత్మానం విష్ణుం ధ్యాయన్న సీదతి॥

తా॥ భగవంతుని ప్రాపకమునుగాను ప్రాప్యముగానును జ్ఞానులు చెప్పుచున్నారు. యజ్ఞ స్వరూపుండగు విష్ణువును ధ్యానించునట్టి వాఁడు కష్టపడఁడు.

పా॥ నాకన్తై మిన్తై నప్పురా౯ శరణేశరణ్ నమక్కు,

తా॥ శేషపర్యంకశాయి యగు భగవంతుండే మనకు శరణము.

ఈ మొదలగు ప్రమాణములయందుఁ జెప్పియున్నట్లు విలక్షణుండగు నొక యధికారి పరమప్రాప్యుండగు శ్రియఃపతియొక్కండే యేదొకదాని మూలమున వశపఱచుకొనఁదగినట్టి సిద్ధోపాయంబనుట.

"ఉణర్న్దవర్ = తెలిసికొనియున్నట్టివారు" అనఁగా ప్రతిబుద్ధులగు అధికారులనుట "ప్రాప్యస్య బ్రహ్మణోరూపం ప్రాప్తుశ్చప్రత్యగాత్మనః। ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తివిరోధిచ వదన్తిసకలావేదా స్సేతిహాస పురాణకాః"

న్న వర్థపంచకత్తైయుమ్ చకారసముచ్చితమాన సమ్బంధ
విశేషత్తైయుమ్ సత్వనిష్ఠరుక్కు శ్రోతవ్యవిశేషముఐ ఉరైక్క
లామ్పడి తిరున్ద క్కణ్డవర్కళై ప్రతిబుద్ధరెన్గిఅదు.

ప్రాప్యమాన బ్రహ్మమావదు? “విష్ణో స్సకాశా దు
ద్భూతం జగత్తత్రైవచ స్థితమ్। స్థితిసంయమకర్తాసౌ జగతో
ఽస్యజగచ్చ సః॥ కృష్ణ ఏవహి లోకానా ముత్పత్తి రపిచా
వ్యయః। కృష్ణస్యహి కృతేభూతం మిదం విశ్వం చరాచర
మ్” ఇత్యాదికళిల్పడియే సర్వకార్యైకకారణమాయ్ సత్యత్వ
జ్ఞానత్వాది స్వరూప నిరూపక ధర్మఙ్గళై యుడైయనుమాయ్
జ్ఞానశక్త్యాదికల్యాణగుణమహోదధియుమాయ్ శుద్ధాశుద్ధవిభూతి
ద్వయత్తుక్కు మేకశేషియుమాయ్ “ఓరుయిరేయో వులకఙ్గ

(ప్రాప్యండగు బ్రహ్మముయొక్క స్వరూపమును, ప్రాప్తయగు జీవునియొక్క స్వరూపమును, ప్రాప్తికిగానగు ఉపాయము యొక్క స్వరూపమును, ప్రాప్తివలనంగలుగంగల ఫలము యొక్క స్వరూపమును, ప్రాప్తికిగానగు విరోధియొక్క స్వరూపము ను వీటినే సమస్తవేదములును ఇతిహాసపురాణంబులున్ను తెలుపుచున్నవి) ఇత్యాదులయందుం జెప్పియున్నట్టి యర్థపంచకమును, పై శ్లోకముననుండు చకారముయొక్క యర్థంబగు సముచ్చయముచేం దెలుపంబడినట్టి సంబంధ విశేషమున్ను వీటిని సత్వగుణప్రధానులగు వారికి సంపూర్ణముగ నుపదేశింపంగలవారు ప్రతిబుద్ధు లనంబడుచున్నారు.

ప్రాప్యంబగు బ్రహ్మమనంగా—"విష్ణోస్సకాశా దుద్భూతం జగత్తత్రైవ చ స్థితం స్థితిసంయమకర్తా సౌ జగతో స్యజగచ్చసః" (ఈప్రపంచము విష్ణువునుండి బుట్టి వానియందే యునికి పట్టుకలది ఈ జగత్తును రక్షించువాండును నియమించువాండును, తానే యదిగాం దానిలోనంతరాత్మగానుండువాండును అతండే) అనియు "కృష్ణ ఏవ హి లోకానా ముత్పత్తిరపి చాప్యయః । కృష్ణస్య హి కృతే భూతమిదం విశ్వం చరాచరం (కృష్ణుండే యీ జగత్తుయొక్క సృష్టి సంహారములకుం గారణంబైనవాడు కృష్ణునిచేతనే యీప్రపంచము రక్షింపంబడుచున్నది.) అనియును యీ మొదలగు తావులం జెప్పియున్నట్లు, సమస్తములగు కార్యపదార్థంబులకును తానే కారణంబై సత్యత్వము, జ్ఞానత్వము ఈ మొదలుగాంగల స్వరూపనిరూపక ధర్మంబులుగలవాండై, జ్ఞానము, శక్తి మొదలగు కల్యాణగుణంబులకాకరంబై నిత్యవిభూతిలీలావిభూతులకు రెం

ళుక్కెల్లా" మెన్నుమ్బడి పరవ్యూహాది పఞ్చప్రకార దివ్యమఙ్గళవిగ్రహయుక్తనాయ్ సర్వలోకశరణ్యనాయ్ శరణాగతవత్సలనాయ్ సర్వప్రకార నిరతిశయభోగ్యనాన నారాయణన్

ప్రాప్తావాన ప్రత్యగాత్మావావదు "పుమాన్న దేవో ననరో నపశుర్నచపాదపః। శరీరాకృతిభేదాస్తు భూపతే కర్మయోనయః॥ నాయం దేవో నమర్త్యోవా నతిర్యక్ స్థావరోపివా। జ్ఞానానన్దమయస్త్వాత్మా శేషోహి పరమాత్మనః" ఇత్యాదికళిల్పడియే దేహేంద్రియాదివిలక్షణనాయ్, జ్ఞానానంద స్వరూపనాయ్, స్వయంప్రకాశనాయ్ స్వస్మైభాసమాననాయ్, అణువాయ్, జ్ఞానానందగుణకనాయ్, పరశేషత్త్వైకరసనాయ్ పరిపూర్ణ భగవదనుభవయోగ్యనాయ్ స్వరూపానుగుణస్వచ్ఛంద కైంకర్యాశ్రయాన జీవన్.

టికిని తానొక్కండే యధిపతియై ,,ఓరుయరేయోవులకంగ భుక్కేల్లామ్'' (ఈలోకంబులకన్నింటికిన్ని యొక్కటియే యాత్మగానున్నవాఁడు) అని చెప్పఁదగినట్లు పర వ్యూహాదిరూపములగ అయిదు విధములగు దివ్యమంగళ విగ్రహములు గలిగినట్టివాఁడై, సర్వలోకశరణ్యుండై, శరణాగతవత్సలుండై, అన్ని విధములను అంతకుమించినది లేనట్టి భోగముగలవాఁడగు నారాయణుండు.

ప్రాప్తయగు ప్రత్యగాత్మ యుండఁగా—,,పుమాన్న దేవో నదరో న పశుర్నచ పాదపః శరీరాకృతిభేదా స్తుభూపైతే కర్మయోనయః'' (ఈ యాత్మ పురుషుండుగాని, దేవతగాని, నరుండుగాని, పశువుగాని, వృక్షముగాని కాదు. ఆ యా కర్మములనుబట్టి దేవాదిశరీరభేదములు గలుగుచున్నవి) అనియు, ,,నాయం దేవో నమర్త్యోవానతిర్యక్ స్థావరోపివాజ్ఞానానందమయస్త్వాత్మా శేషోహి పరమాత్మనః' (ఈయాత్మ దేవశరీరుండుగాని, మనుష్యశరీరుండుగాని తిర్యగ్జంతువుగాని స్థావరపదార్థముగాని కాదు. ఈతండు జ్ఞానానందమయుండును. పరమాత్మకు శేషభూతుండును) అనియు ఈ మొదలగు తావులఁజెప్పియున్నట్లు, దేహేంద్రియాది విలక్షణుండై, జ్ఞానానంద స్వరూపుండై, స్వయంప్రకాశుండై తనకుగాను ప్రకాశించునట్టివాఁడై అణువై, జ్ఞానానందగుణుండై పరమాత్మకు శేషభూతుండుగా నుండుటయే యెక్కువ భోగ్యముగాఁగలవాఁడై, పరిపూర్ణంబగు భగవదనుభవమునకు యోగ్యుండై, స్వరూపానురూపంబై స్వేచ్ఛగ ననుష్ఠింపఁబడునట్టి కైంకర్యముఁగోరునట్టి వాఁడగు జీవుండు.

ప్రాప్యోపాయమావదు ఇజ్జీవన్ సంసారసాగరత్తైక్కడన్దు అక్కరైప్పడుకైక్కు ఉపాయ సాధనమాక స్వబుద్ధియాలే కొళ్ళుప్పడుమ్ శాస్త్రోక్తమాన వరమ్. ఇదు సిద్ధమెన్ఱుమ్ సాధ్యమెన్ఱుమ్ ఇరణ్డువకైయాయిరుక్కుమ్.

సిద్ధోపాయమావదు నిత్యసిద్ధఙ్గళాన స్వరూపగుణఙ్గళై యుడైయనాయ్ సర్వజ్ఞనాకైయాలే పరహితవేదియాయ్, సర్వశక్తియాకైయాలే సర్వానిష్టనివారణక్షమనాయ్, సర్వభూత నిసర్గసుహృత్తాకైయాలే పరానిష్ట నివారణాదికళిల్ సర్వదా ఽభిముఖనాయ్ "సర్వజ్ఞోపి హి విశ్వేశ స్సదా కారుణికోపి సన్ । సంసారతన్త్రవాహిత్వాద్రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" ఇత్యాదికళిల్పడియే అవసరప్రతీక్షనాయ్ వ్యాజవిశేష వశీకరణీయనాయ్ సఙ్కల్పితవిశేషత్తిల్ సహకారినిరపేక్షనాయ్ స్వైర ప్రవృత్తనాయ్ మోక్షప్రదానత్తుక్కు అవ్యవహిత సఙ్కల్పాశ్రయనాన శ్రియఃపతి.

సాధ్యోపాయమావదు పురుషనుక్కు కర్తవ్యమాక చోదితమాన పురుషార్థసాధనమ్, మోక్షార్థమాన సాధ్యోపాయమ్ భక్తియెన్ఱుమ్ ప్రపత్తియెన్ఱుమ్ ఇరణ్డువకైయా యిరుక్కుమ్.

ప్రాప్యోపాయంబనఁగా— ఈ జీవుండు సంసారసముద్రమునుండి కడ తేరుటకుగాను నిరపాయంబగునట్టి సాధనముగ స్వబుద్ధిచేఁ గోరంబడునట్లు శాస్త్రోక్తంబగునట్టి యర్థము. ఇది సిద్ధమనియు, సాధ్యంబనియును రెండువిధములుగా నుండును.

సిద్ధోపాయంబనఁగా— నిత్యసిద్ధంబులగుస్వరూపగుణంబులఁగలిగినట్టివాఁడై, సర్వజ్ఞుండగుటచే పరులయొక్క హితముఁగు దెలిసినవాఁడై, సర్వశక్తియగుటంజేసి సర్వానిష్టంబులను నివారించుటలో సమర్థుండై, సమస్తభూతములకును స్వభావసిద్ధముగానే మిత్రుండైనందున పరుల యనిష్టంబులను నివారింపఁజేయుటకై సర్వదా సన్నద్ధుండై యున్నట్టివాఁడై, "సర్వజ్ఞోఽపి హి విశ్వేశస్సదా కారుణికోఽపి సన్ । సంసారతంత్రవాహిత్వా ద్రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" (సర్వేశ్వరుండు సర్వజ్ఞుండైనను కారుణికుండైనను సంసారతంత్రమును నడిపించునట్టివాఁడైనందున రక్ష్యాపేక్షను ఈజీవునికోరికనున్న యెదురు చూచుచున్నాఁడు) ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు తగినట్టిసమయముకై నిరీక్షించునట్టివాఁడై, యేదొక వ్యాజమాత్రమున వశపఱచుకొనఁదగినట్టివాఁడై సంకల్పించుకొనిన దానిని నెఱవేర్చుటలో వేఱొకని సహాయము నపేక్షింపనివాఁడై, స్వార్థముగాఁ బ్రవర్తించునట్టివాఁడై, మోక్షము నొసంగుటలో నిరాటంకంబైనట్టి సంకల్పముగలవాఁడగు శ్రియఃపతి.

సాధ్యోపాయంబనఁగా— పురుషునిచే ననుష్ఠింపవలసినదిగా విధింపఁబడినట్టి పురుషార్థసాధనము. మోక్షార్థంబగు సాధ్యోపాయము భక్తియనియు, ప్రపత్తియనియును రెండు విధములు గలది.

భక్తిరూపమాన సాధ్యోపాయమ్ కర్మయోగజ్ఞాన యోగసంస్కృతాంతఃకరణసాధ్యమాయ్ అష్టాంగయోగయుక్తమాయ్, వర్ణాది నియతాధికారమాయ్, వర్ణాశ్రమ ధర్మేతికర్తవ్యతాకమాయ్ (కృచ్ఛ్రసాధ్యమాయ్) తైలధారావదవిచ్ఛిన్నస్మృతిసంతతి రూపమాయ్, అహరహరభ్యాసాధేయాతిశయమాయ్, ఆప్రయాణ మనువర్తనీయమాయ్, ప్రారబ్ధేతర పుణ్యపాపనివర్తకమాయ్ స్వయత్నసాధ్యాన్తిమ ప్రత్యయవిశేషమాయిరుక్కుమ్.

ప్రపత్తిరూపమాన సాధ్యోపాయమ్ మహావిశ్వాసాది సంస్కృతాంతఃకరణసాధ్యమాయ్, షడంగయోగసంజ్ఞితమాయ్, అనన్యోపాయ సర్వాధికారమాయ్ ఆనుకూల్యసంకల్పాదిమాత్రపరికరమాయ్, సుకరమాయ్, ప్రార్థనాన్విత సకృద్భరన్యాసరూపమాయ్, అనాధేయాతిశయమాయ్, ఆదేహపాతమ్ స్వస్వరూపావృత్త్యాదికర్తవ్యశేషరహితమాయ్, ప్రారబ్ధకర్మనివర్తకమాయ్ స్వప్రయత్న సాపేక్షాన్తిమప్రత్యయానపేక్షమాయిరుక్కుమ్. సాధ్యోపాయత్తిల్ అనుపాయత్వాదివ్యపదేశమ్ పరసంకల్ప సాపేక్షత్వాదినిబంధనమ్.

భక్తిరూపంబగు సాధ్యోపాయము కర్మయోగ, జ్ఞాన యోగంబుల సంస్కారముగల యంతఃకరణముచేసాధింపవలసినదై, అష్టాంగయోగయుక్తంబై, వర్ణాదులనుబట్టియుండునట్టి యధికారముగలదియై, వర్ణాశ్రమధర్మానుష్ఠానముచే నుపకరింపఁబడునదియై, (కష్టముతో సాధింపవలసినదై) తైలధారవలె నెడతెగని స్మృతి సంతానరూపంబై. ప్రతిదినము అభ్యసింపగా నభ్యసింపఁగా నతిశయించునదియై, యావజ్జీవమనుష్ఠింపవలసినదియై, ప్రారబ్ధమును తప్ప తక్కిన పుణ్యపాపకర్మంబులను (సంచితాగాములను) నశింపఁజేయునదియై, స్వప్రయత్నముచే తనే అంతిమస్మృతిఁగలుగఁజేసికొనవలసినదిగా నుండును.

ప్రపత్తిరూపంబగు సాధ్యోపాయంబనునది మహావిశ్వాసాదుల సంస్కారముగల యంతఃకరణముచే సాధింపవలసినదియై, షడంగయోగంబను ప్రసిద్ధికలదై, అనన్యోపాయులగు వారికందఱికిని యధికారముగలదియై, ఆనుకూల్యసంకల్పాదులు మాత్రము అంగముగాఁగలదియై, సుకరంబై, ప్రార్థనతోఁగూడినదైనకర్తృత్వంబగు భరన్యాసరూపంబై, వేఱొక్కదాని మూలముగనతిశయమునుపొందింపనక్కఱలేనిదై, యావజ్జీవము పదేపదే యనుష్ఠించుచుండుట యను వేఱొక్క తరువాయి లేనిదై, ప్రారబ్ధకర్మమును నయితము నశింపఁజేయునట్టిదియై, అంతిమస్మృతినిస్వప్రయత్నముచే సాధించుకొనన క్కఱలేనిదిగాను నుండగలదు. సాధ్యోపాయము (స్వతంత్రమగు) మోక్షోపాయముకాదని (కొందఱు) చెప్పుట యది సర్వేశ్వరునిసంకల్పమునుబట్టి యుండునదియైనందున నని యెఱుంగునది.

ఇజ్జు ఫలమావదు స్వాధికారానుగుణ వశీకరణవిశేషత్తాలే ఉత్తరపూర్వాఘాశ్లేషవినాశజ్గళ్ పిఱన్దు స్థూలశరీర నివృత్తియుణ్డాయ్ ఊర్ధ్వగతివిశేషత్తాలే ఉత్క్రాన్తనాయ్ అర్చిరాదిమార్గత్తాలే ఆతివాహికరాలే అతిలంఘిత త్రిగుణమణ్డలనాయ్ అవధూతసూక్ష్మశరీరనాయ్ అప్రాకృత దేశవిశేష ప్రవిష్టనాయ్ అవిర్భూతస్వరూపనాయ్ అపహతపాప్మత్వాది గుణాష్టక విశిష్టనానవనుడైయ దేశకాలస్వరూపపరిచ్ఛేద రహిత కైఙ్కర్యపర్యన్తమాన పరిపూర్ణ భగవదనుభవానన్దమ్.

ప్రాప్తివిరోధి యావదు బీజాంకురన్యాయత్తాలే అనాదియాక ప్రవృత్తమాన నకృత్యకరణ కృత్యాకరణ ప్రవాహత్తాలే ఉత్పన్నమాయ్ ప్రాయశ్చిత్తప్రణ్ణాదాఱ్కు అనతిలంఘనీయఫలమాయ్ ఆగమైకసమధిగమ్యమాయ్ అనుప్రేక్షణీయవిపాకసమయమాయ్ ఆబ్రహ్మాన్తంబ మభివ్యాప్తమాయ్ అత్యంతవిషమప్రవాహమాయ్ అతిఘోరనరకాద్యనర్థపరంపరాహేతువాయ్ చక్రవత్పరివర్తనమాయ్ ఆమోక్షమనువర్తమాన భగవన్నిగ్రహసన్తానముమ్ అదిఱ్ కార్యకారణ వర్గముమ్,

ఈసందర్భమున ఫలమనఁగా—స్వాధికారానుగుణంబగు వశీకరణోపాయముచే (భక్తిచేఁగాని ప్రపత్తిచేఁగాని) సంచితాగామి పాపకర్మంబులు నశించి, యీ స్థూలశరీరము విడిచిపోయి, ఊర్ధ్వనాడి గుండ శరీరములోనుండి బయలు వెడలి, అర్చిరాది మార్గము నవలంబించి ఆతివాహికుల సహాయముచే పాంచభౌతికమండలము నతిక్రమించిపోయి, సూక్ష్మశరీరమును విడనాడినట్టివాఁడై, అప్రాకృతదేశవిశేషమును (శ్రీవైకుంఠమును) బొంది, స్వస్వరూపావిర్భావముగలవాఁడై అపహతపాప్మత్వాది గుణవిశిష్టుండైనట్టి జీవునికి దేశకాల స్వరూప పరిచ్ఛేద రహితంబైనట్టిదై కైంకర్యపర్యంతంబగు పరిపూర్ణ భగవదనుభవము వలనఁగలుగునట్టి యానందము.

ప్రాప్తివిరోధియనఁగా—బీజాంకురన్యాయప్రకారము అనాదికాలముగ వచ్చుచున్నట్టి యకృత్యాకరణ కృత్యాకరణ పరంపరచే నుత్పన్నంబైనదై, అందులకుగాను ప్రాయశ్చిత్తము నొనర్చుకొననట్టి వారిచే తప్పక యనుభవింపవలసినదియై, శాస్త్రముద్వారా మాత్రమే తెలియఁదగినదియై, ఫలానుభవ మెప్పుడో తెలియనిదియై, ఆబ్రహ్మస్తంబపర్యంత మంతటను వ్యాపించియుండునదై, మిక్కిలి క్రూరంబైనట్టి ప్రవర్తనగలదై, అత్యంతము భయంకరంబులగు నరకానుభవాద్యనర్థంబులకు పరంపరగా హేతుభూతంబై, చక్రమువలె నావృత్తిగలదియై ఈతండు మోక్షమును బొందువరకును తటస్థించుచుండునట్టి, భగవన్నిగ్రహమున్ను, అందులకుగానగు కార్యకారణ సముదాయంబును.

ఈతావున సంబంధమనఁగా— ప్రాప్తయగు జీవాత్మకు ప్రాప్యుండగు పరమాత్మతోఁగల సంబంధము. ఇది ఆధేయత్వమనియు, విధేయత్వమనియు, అపృథక్సిద్ధత్వము (వేఱుగానుండనిదగుట) అనియు శేషత్వమనియు, శరీరత్వమనియు కింకరత్వమనియు, భోగ్యత్వమనియు, భోక్తృత్వమనియు, ఇట్లు సామాన్యవిశేషాదిరూపముగ పలు తెఱంగుల విభజింపఁబడియున్నది.

ఇట్లు మోక్షశాస్త్రముచేఁ దెలియవచ్చునట్టి ప్రాప్యమునున్న, ప్రాప్తనున్న, ప్రాప్త్యుపాయమునున్న, ప్రాప్తిఫలమున్న, ప్రాప్తిప్రతిబంధకమునున్న, సంబంధమునున్న శాస్త్రదృష్టిచే బాగుగా నెఱింగియుండునట్టివారు ప్రతిబుద్ధులనఁబడుచున్నారు.

"కాట్ట=చూపింపఁగా" అనఁగా అట్లు ప్రతిబుద్ధులైనట్టి వారు ఉపదేశింపఁగా ననుట. ఉపదేశించుటయెట్లనఁగా, "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః" (ఆచార్యుని సన్నిధియందు దండము సమర్పించి కౌశలప్రశ్నలనడిగి వారికి పరిచర్యనొనర్చి వారివలన తత్త్వార్థముల నెఱుంగుము. తత్త్వద్రష్టలగు జ్ఞానులు జ్ఞానమును ఉపదేశించుదురు) అనియు "యే సన్తుష్టాశ్శీలోపేతాః సత్యార్జవదయాపరాః జితేన్ద్రియాజితక్రోధాస్తానుపాస్వచపృచ్ఛచ" (శాస్త్రజ్ఞులై సత్యార్జవాద్యాత్మగుణోపేతులై జితేంద్రియులును శాంతస్వరూపులైనట్టి వారిని ఆశ్రయించి వారిని సద్విషయములను గుఱించి యడుగుమా) అనియును ఈ మొదలగు తావులఁజెప్పియున్నట్లు, భక్తిశ్రీ

పేషితార్థంగళైయుమ్ ఉపదేశిక్కవల్ల వనన్యప్రయోజనరాన జ్ఞానికళ్ పుకలొన్నిల్లాద నమక్కు ,,సర్వయోగ్య మనాయాస మప్రమాద మనూపమమ్। ప్రపన్నార్తిహరం కృష్ణం శరణం గన్తుమర్హసి''ఇత్యాది కళిల్పడియే నిరపాయ సాధ్యోపాయ విశేషత్తాలే వశీకరణీయమాన సిద్ధోపాయత్తై వెళియిట్టు వైత్తపడి.

ఇత్తాలే నానున్ ఎన్నై రక్షిత్తుక్కొళ్ళమాట్టేన్. నీయు ఎనక్కు రక్షకరల్లై. మేలే ఎన్నుడైయ వ్యాపారవిశేషత్తాలే అశేషయఞ్ దేవరీరే యెన్నైరక్షిత్తరుళవేణుమెన్ఱు భరన్యాసరూప వశీకరణ విశేషానుష్ఠానముమ్ ఫలితమ్.

అగ్గనన్ఱిక్కే ఓన్ఱే పుకలెన్ఱుణర్న్దవర్ ఎన్ఱు ఆచార్యర్ కళై విశేషిక్కిఱదాకవుమామ్. అప్పోదు, (కాట్ట) ఎన్ఱదు 'శివ భరోహము కారిషి ధార్మికై'రిత్యాదికళిల్పడియే సర్వ శేషిత్వాదికళిలే 'ఆత్మాత్మీయభరంచ యత్కించి ద్దుర్భరం దుస్త్యజం మమ । తత్సర్వం తవవిన్యస్తం శుభయోః పాద

ధతో నాశ్రయించునట్టి వారికపేక్షితంబులగు శాస్త్రార్థంబుల నన్నింటిని యుపదేశింప సమర్థులై యనన్యప్రయోజనులగు జ్ఞానులు వేఱొక్క యుపాయం బెద్దియును లేనట్టి మనకు "సర్వయోగ్య మనాయాస మప్రమాద మనూపమం ప్రపన్నార్తి హారం విష్ణుం శరణం గంతు మర్హసి" ( అందఱికిన్ని అధికారముగలదియు, కష్టంబెద్దియునులేనిదియు, ప్రమాదము కవకాశమీయనిదియు, నిరుపమానమునునగు ఉపాయమునుగాఁగొని ఆశ్రితులకష్టములఁ దొలగించునట్టివాఁడగు విష్ణువు నాశ్రయింపుమా) ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు నిరపాయంబగు సాధ్యోపాయము (ప్రపత్తి) మూలముగ వశపఱచుకొనఁదగినట్టి సిద్ధోపాయము నుపదేశించుదురనుట.

దీని తాత్పర్యమేమనగాఁ—నేనున్ను నన్ను రక్షించుకొనజాలను. వేఱే నాకురక్షకు లెవ్వరున్ను లేరు. అటుపయిని, నే నొర్చునట్టి దానితో నిమిత్తములేకుండ దేవరవారే నన్ను రక్షించి కృపచేయవలయుననెడి భరన్యాసరూపంబగు వశీకరణోపాయానుష్ఠానము తెలుపఁబడిన దనుట.

అథవా "ఒన్ఱేఫుకలెన్ఱునర్న్దవర్" అను దానిని ఆచార్యులకు విశేషణముగానును గొనవచ్చును. అట్లు అన్వయించుకొనునప్పుడు "కాట్ట=చూపింపఁగా" అనఁగా, "తవభరోహమకారిషిధార్మికైః" (ఓస్వామీ నాభారమును నీపై బెట్టుమని ధార్మికు లుపదేశించిరి) అన్నట్లు, సర్వశేషియగు సర్వేశ్వరుని శ్రీపాదములయందు "ఆత్మాత్మీయంచ యత్కించిద్దుర్భరం దుస్త్యజంమమ తత్సర్వం తవ విన్యస్తం శుభయోః పాదపద్మయోః" (ఓస్వామీ! నాచే భరింపనేరనిదియు, దు

పద్మయోః' ఎన్ను ఆత్మాత్మీయంగాన స్వామి అనన్యార్హత్వేన సమర్పిక్క వేణ్డుమవడి.

(తిరువరుళాల్) ఎన్నదు 'సతతం నిపతితం భూమౌ శరణ్యశ్శరణాగతమ్ । వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్ ॥ కృపయా కేవల మాత్మనా తుష్టుప' ఇత్యాదికళిల్ పడియే ప్రత్యుపకారాది నిరపేక్ష పరమకృపైయాలే ఎన్నపడి.

'యామాలంబ్య సుఖేనేమం దుస్తరం త్రిగుణోదధిం । నిస్తరన్త్యచిరేణైవ వ్యక్తంధ్యానపరాయణాః' ఎన్గిఱ న్యాయత్తాలే అవిలమ్బితానాయాసమాయ్ ఫలసిద్ధియుణ్డాక్కుమ్పడి ఆశ్రితరక్షణత్తిలే ఆత్మలాభత్తై అభిముఖనాక్కికిఱ అఖిలజగన్మాతావినుడైయ అనపాయకృపైయాలే ఎన్నవుమామ్.

స్వ్యజంబునగు ఆత్మాత్మీయంబెద్దికలదో) అది యంతయును మంగళశరీరంబులకు సిపాదపద్మముల యందర్పింపఁబడినది) అని చెప్పినట్లు. ఆత్మాత్మీయంబులగు మనలను వానిచే మాత్రమే రక్షింపవలసినట్టి వారినిగా వానికి సమర్పింపఁగా నని యర్థము.

"తిరువరుళాల్ = పరమకృపచేత" అనఁగా "సతం నిపతితంభూమౌ శరణ్యశ్శరణాగతం వధార్హమపి కాకుత్థ్సః కృపయాపర్యపాలయత్" (వధార్హుండైనను కాకాసురుండు శరణాగతుండై శ్రీరామచంద్రుని శ్రీపాదములపై బడఁగా, కృపతో రక్షించెను) అనియు, "కృపయా కేవలమాత్మసాత్కురు" (ఓస్వామీ! నియొక్క కృపచేతనే నన్ను నీవస్తువునుగాఁ జేసికొనుము) అనియు, ఈమొదలగు తావులఁ జెప్పియున్నట్లు, ప్రత్యుపకారము నపేక్షింపనిదియగు పరమ కృపచేననుట

అథవా, (తిరువరుళాల్ = లక్ష్మీదేవికృపచే) అనఁగా "యామాలంబ్యసుఖేనేమందు స్తరంత్రిగుణోదధింనిస్తరన్యచిరేణైవవ్యక్తంధ్యాయ పరాయణాః"(ఏలక్ష్మీదేవిని ధ్యానించి మహాయోగులుసత్త్వరజస్తమోగుణమయంబును, వ్యక్తంబును, దుస్తరంబునగు సంసారమును శీఘ్రముగా నతిక్రమించుచున్నారో) అన్నట్లు ఆలస్యము కాకుండగను, కష్టపడనక్కఱ లేకుండగను ఫలసిద్ధిగలుగునట్లు, ఆశ్రితులను రక్షించు విషయమున తన భర్తను అభిముఖునిగాఁ జేయునట్టి యఖిలజగన్మాతయొక్క (లక్ష్మీదేవియొక్క) ఉపాయరహితంబగు కృపచేననియును అర్థము చెప్పుకొనవచ్చును.

(అన్తైముడై క్కులజ్ఞాణ్ణ)ఎన్ఱదు ‘అనేనైవతు మంత్రేణ స్వాత్మానం మయినిక్షిపేత్ । మయినిక్షిప్తకర్తవ్యః కృతకృత్యో భవిష్యతి‘ ఎన్ఱుమ్ ‘దురాచారోఽపిసర్వాశీకృతఘ్నో నాస్తికః పురా । సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయా శరణంహియః॥ నిర్దోషం విద్ధి తంజంతుం ప్రభావాత్పరమాత్మనః’ ఎన్ఱుమ్ ‘త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణంగతః ఎన్ఱుమ్ ‘అనన్యైనం హరిశ్రేష్ఠ దత్తమస్యాభయం మయా’’ ఎన్ఱుమ్ శ్లోకఙ్గళిలపడియే భరసమర్పణ సమనంతరం సముక్షస్వరక్షణార్థ కర్తవ్య శేషమిల్లాదపడి భరస్వీకారం పణ్ణినవరెన్ఱపడి.

(నమ్మాత్తికిరి తిరుమాళ్) ఎన్ఱదు ‘వేగవత్యాఉత్తరే తీరే పుణ్యకోట్యాం హరిస్స్వయమ్ । వరదస్సర్వభూతానా మద్యాపి పరిదృశ్యతే,’ ‘నిగరిల్ పుకళాయులకు మూన్ఱుడైయా

«అన్ఱేయడైక్కలంకొండ = ఆరోజుననే మమ్ములను రక్ష్యవస్తువుగా నంగీకరించినట్టి, అనఁగా — «అనేనైవతుమంత్రేణ స్వాత్మానం మయినిక్షిపేత్ మయినిక్షిప్తకర్తవ్యః కృతకృత్యోభవిష్యతి" (ఈమంత్రముచేతనే తన భారమునంతయును నాపైయుంచునది. నాపై నుంచినవాఁడు కృతకృత్యుండు కాఁగలడు) అనియు, «దురాచారోపి సర్వాశీ కృతఘ్నో నాస్తికః పురా। సమాశ్రయేదాదిదేవం శ్రద్ధయా శరణంహియః నిర్దోషం విద్ధితంజంతుంప్రభావాత్పరమాత్మనః" (ఇంతకుముందు దురాచారుండైనను, ఆహారనియమము లేనివాఁడైనను, కృతఘ్నుండైనను, నాస్తికుండైనను, ఆదిదేవుండగు భగవంతుని యాశ్రయించినచో, వాని ప్రభావమువలననట్టి వానిని దోషరహితునిగా నెఱుంగునది) అనియు, «త్యక్త్వాపుత్రాంశ్చదారాంశ్చ రాఘవం శరణంగతః" (దారాపుత్రులను విడనాడి శ్రీరామచంద్రుని శరణుజొచ్చెను) అనియు, «ఆనయైనంహరిశ్రేష్ఠ దత్తమస్యాభయంమయా" (ఓసుగ్రీవా! విభీషణుని పిలుచుకొనిరమ్ము నేనతనికి యభయము నిచ్చినాఁడను) అనియును చెప్పియున్నట్లు భరసమర్పణనొసర్గినపిదప మనకు మనలను రక్షించుకొనుటకై చేయవలసిన దద్దియును లేకుండునట్లు మన భారమునంతయును తనపైబెట్టుకొనుట కొప్పుకొనినాడనుట.

(నమ్మత్తికిరిత్తిరుమాల్ = మాహస్థిగిరియందు వేంచేసియున్నట్టి శ్రియఃపతి, అనఁగా «వేగవత్యాస్తుతీరే పుణ్యకోట్యాంహరిస్స్వయం। వరదస్సర్వభూతానా మద్యాపి పరిదృశ్యతే' (వేగవతీనద్యుత్తర తీరమున పుణ్యకోటి విమానంబున నారాయణుండు స్వయముగవచ్చి వేంచేసియుండి

(అరవము

యెన్నైయాళ్‌వానే' ఇత్యాది కళిల్ప్పడియే ఆశ్రిత సంరక్షణో

పయుక్త సౌశీల్య వాత్సల్యస్వామిత్వ విశిష్టనాయ్ ఎన్గపడి.

(ఇన్ద్రైయుళ్ళై లిట్టైయడిశేర్ప్పర్) న్దను నణ్ణినవర్

కళుక్కు విణ్ణులక్ న్దరగెళ్ళైన్దు రక్షాపేక్షా ప్రతీక్షనాయ్

మణ్ణులకిల్వన్దు ఘంప్రపదానోన్ముఖనాయ్ నిఱ్కుం పెరుమాళ్

'క్వాహమత్యన్తదుర్బుద్ధిః క్వచాత్మహితవీక్షణమ్ । యద్ధితం

మమ దేవేశ తదాజ్ఞాపయ మాధవ॥ త్వాం ప్రపన్నోస్మి దా

సస్తే నాన్యాకాపి గతిర్మమ । అద్యైవ కింకరీకృత్య సిధేహి

త్వత్పదాంబుజే' ఇత్యాది కళిప్పడియే నామ్ పరమపురుషార్థ

క మనస్కారాముళవిల్ అప్పొదే కొడువులకు కాట్టాదే

నులయభీష్టంబులను నెరవేర్చుచునిప్పటికిని సేవింపఁబడుచున్నా డు) అనియు, «సికరిల్ పుకళ్ళాయులకు మూన్ఱుక్కుడైయాయె నై గాళ్ళానే' (అనవద్యంబులగు కల్యాణగుణములు గలవాఁడు ను, మూఁడులోకములకును స్వామియునైన వాఁడు నాకు ర క్షకుండు) అనియును ఈ మొదలకు తావులఁ జెప్పియున్నట్లు ఆశ్రితులను రక్షించుటలో నుపయుక్తంబులగు సౌశీల్య, వా త్సల్య స్వామిత్వంబులతోఁ గూడియుండునట్టివాఁడైన యనుట.

«ఇన్ఱైయే శైయిల్ యిన్ఱైయడిశేర్వర్' = ఈరోజుననే యొప్పుకొంటిమేని తన సుందరములగు శ్రీపాదములతోఁ జే ర్చుకొనును' అనఁగా ఆశ్రయించినవారికి పరమపదము నొ సంగుటకై సిద్ధముగానుండి రక్షింపమని కోరితేచాలుననుకొ ని యందులకై నిరీక్షించుచుండి యీలీలావిభూతికి వచ్చి వేం చేసియుండి, ఫలప్రదానోన్ముఖుండై యున్నట్టి పెరుమాళ్ళు' «త్వాహమత్యంతదుర్బుద్ధిః త్వచాత్మ హితవీక్షణం। యద్ధితం మమదేవేశ తదాజ్ఞాపయ మాధవ। త్వాం ప్రపన్నోస్మి దాస స్తేనాన్యోత్వాపిగతిర్మమ అద్యైవకింకరీకృత్యనిధేహిత్వత్పదాం బుజే» స్వామీ? నేనా అత్యంతము దుర్బుద్ధిగలవాఁడను, ఇట్టి వాఁడనగు నేనునాహితమునకై యోచించుకొనుటయెక్కడ? దేవరవారిని శరణుజొచ్చినాడను మీరే నాకు హితమునునియ మింపుడు ఈరోజుననే నన్ను దేవరవారి కింకరునిగాఁ జేసికొని దేవరవారి శ్రీపాదములయందుఁ జేర్చుకొనుము] ఈ మొద లగు తావులఁ జెప్పియున్నట్లు, మనము పరమపురుషార్థము విషయమున మనస్సుగలవారమగు నప్పుడు వెంటనే యీ కారాగృహంబగు నరలోకమును మనకుఁ గానరాకుండఁ జేసి, నిరతి

కొళ్ళుమ్ శోతి యుయరత్తుక్కూట్టియ తిరువడి కూట్టి యరుళ్వరెన్ఱపడి.

(ఇవిప్పిఱవో్మ్) ఎన్ఱదు 'ఇన్ఱు శెట్టు' ఇత్యాది కళిఱ్ఱుడియె పరావర పురుషార్థ వివేకత్తాలే ఐశ్వర్య కైవల్యజ్ఞైరౌష్ప్రాప్తిత్తినామ్ ఏదేను మొఱు భగవత్క్షేత్రవాస కైంకర్యాది సంగత్తాలే. ఇజ్జేతిరువేఙ్కడక్కులత్తిరుక్కుమ్ శైనై' ఎన్ఱు తిరువై యుమ్ తిరుక్కు మళవిలుమ్ 'శరణమాకుమ్ తనతాళడైన్దార్ కెల్లామ్, మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుమ్ పిరాన్' 'త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున' 'కొళ్ళక్కుఱైవిలన్ వేణ్డిత్తెల్లామ్ తరుమ్' ఇత్యాదిగళిఱ్పడియే ఇవ్వుయినుక్కు ఒరు శరీర పరిగ్రహముణ్డాకాదపడి ప్రారబ్ధకర్మవిశేషత్తైయుమ్ ఒళివిత్తు కాలే కట్టుతు రక్షిత్తరుళువరెన్ఱపడి.

(సన్తపనువదెల్లా) మెన్ఱను ఇన్దేహమ్ విడుముళవుమ్ 'భోగ్యైః పుణ్యక్షయం తథా' ఎన్గిఱపడియే అనుకూలంగళ్ పను

---

*పా॥ ఇఙ్గేతిరువేఙ్కడక్కులత్తిరుక్కుమ్ శైనై ఇగుమానిలమున్నణుమిఴ్న్ద,
శెఙ్గోల త్తపవళవాయ్ చ్చెన్దామరై క్కణ్ణెన్నమ్మాన్,
పొఙ్గేఴుపుగఴ్కళ్ వాయవాయ్ప్పులన్గొళ్ వడివెన్ మనత్తాయ్
అఙ్గేయ్ మలర్గళ్ కైయవాయ్వழிపట్టోడవరుళిలే.

తా॥ విస్తారమైనట్టి భూమిని ప్రళయకాలమున మ్రింగి సృష్టికాలమున వెడల గ్రక్కినట్టిన్ని యెఱ్ఱగ పగడమువలెనుండు అధరమునున్ను, తామర పుష్పమువలె నుండు తిరునేత్రములనున్ను గలిగియున్నట్టి నా స్వామియొక్క కల్యాణ గుణంబులను నోరార అనుసంధించుకొనుచు, మనోహరంబగు దివ్యమంగళవిగ్రహమునున్ను మనసార స్మరించుకొనుచు వానికి దగినట్టి పుష్పంబులను చేతిలోనుంచుకొని భగవద్భక్తులు మనోవా

కయ జ్యోతిర్మయంబైనట్టి యథార్థ (లోకమునందు దుర్లభంబు లగు తన శ్రీపాదంబులతోఁ జేర్చుకొను నారాయణుఁడనుట.

«ఇప్పిఱవినోమ్=ఇఁక యీలోకమునందు జన్మింపము' అనఁగా «కణ్ణుకేట్టు' ఇత్యాదిగాథలయందుఁ జెప్పియున్నట్లు, పరావరపురుషార్థ వివేకముచే నైశ్వర్య కైవల్యంబులను విడనాడినట్టి మనము ఏదైన నొకభగవత్ క్షేత్రమునందు వసించి కైంకర్యాదులనొనర్చుచు, *«ఇంగేతిరున్దేఱ్క్కుప్పిఱిక్కుమ్ ఏన్ఱే' అని సాయించినట్లు మోక్షముకై త్వరపడకుండినను «శరణమాకుమ్ తన తాళ్దైన్దార్క్కెల్లామ్ మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుమ్ పిరాన్' (తన శ్రీపాదంబుల నాశ్రయించిన వారికి మోక్షోపాయము గాఁగలఁడు మరణము నొందినప్పుడు వైకుంఠము నిచ్చునట్టి యుపకారకుండు) అనియు, «త్యక్త్వా దేహం పునర్జన్మ నైతిమామేతి సోర్జున' (ఓ యర్జునా! నన్ను శరణుజొచ్చినవాఁడు శరీరమును విడనాడినపిమ్మట నన్నుఁ బొందుచున్నాఁడు మరల యీ లోకమున జన్మింపఁడు) అనియు, «కొళ్ళక్కుఱైవిలన్ వేండిత్తెల్లామ్ తరుమ్' (కొరతలేకుండ కావలసినవాటి నన్నింటిని యీయఁగలఁడు) ఇత్యాదిగాథలఁ జెప్పియున్నట్లు ఇఁక నీవు వేఱె జన్మింపెత్త నక్కఱలేకుండ ప్రారబ్ధకర్మమునున్ను ఏదోక దానిమూలముగ నశింపఁజేసి రక్షింపఁగలఁడనుట.

«నన్దవరువ తెల్లామ్= రానున్న దంతయును మంచిదేను' అనఁగా ఈదేహము విడిచిపోవువఱకును «భోగైః పుణ్యక్షయంతథా' (భోగానుభవముచే పుణ్యకర్మంబులను నశింపఁజేసికొను

---

కార్యంబులతో నొనర్చుచువచ్చునట్టి కైంకర్యమార్గమునసుండి యీ లోకమున సంచరించునట్టి నాకేమితక్కువ?

మన్నై సహాన్యసుఖాని భక్తైర్భ్యోహితబుద్ధ్యా కరోషిహి । శస్త్ర
క్షారాగ్ని కర్మాణి స్వపుత్రాయయథా పితా ॥ యన్యాను
గ్రహమిచ్ఛామి తస్య విత్తంహరామ్యహమ్' ఇత్యాదిగళిల్ప
డియే ప్రారబ్ధమువృత్తిల్ శక్తై తీర్త్తపడియాలుమ్ (రత్న
పర్వత మారుహ్య యథారత్నంనరో మునే। సతాఽనుభూప
మాదత్తే తథా కృష్ణా న్మనోరథాన్ ॥ పఙ్క్తల్పాదేప భగవాన్
తత్త్వతో ధ్యావితాత్మనామ్ । వృత్తాన్యముష్మిం కాలం సేచయ
త్యమృతేనతు' ఇత్యాదిగళిల్పడియే కైంకర్యమనోరథతుక్కు
భంగం వారామైయాలుమ్ యావచ్ఛరీరపాతమ్ నడక్కవు
మకై యెల్లామ్ప్రియహితవిశేషంగళైస్తు ప్రీతరాకిఅపడి. (ప్రియ
మితర దథాపివా యద్యథా వితరసి వరద ప్రభో త్వంహిమే।
తదనుభవనమేవ యుక్తంహి మే త్వయి నిహితభరోస్మిసోఽ
హంయతః' ఎన్ఱార్కళిఱె.

ను) అని చెప్పియున్నట్లు అనుకూలంబులైనవి తటస్థింపనప్పు డది ప్రారబ్ధ పుణ్యకర్మ రూపమగు బంధము విడిపోవుట యగుటం జేసియును, రామున్న ప్రతికూలంబులు 'హారిద్రః ఖానిభక్తేభ్యో హితబుద్ధ్యా కరోతిహి శస్త్రక్షారాగ్నికర్మాణి స్వపుత్రాయపితా యథా యస్యానుగ్రహమిచ్ఛామి తస్యవిత్తం హరామ్యహం' (కన్నతండ్రి కొడుకులకు రుపుకోసి చురుకులో కాచుటను హితబుద్ధితో నొనర్చునట్లు, భగవంతుండు తనభక్తులకు కష్టంబులను హితబుద్ధితో గలుగఁజేయుచున్నాడు ఎవ్వానియెడల భగవంతుని కనుగ్రహము గలుగుచున్నదో, వాని ద్రవ్యమును హరించుచున్నాడు) ఇత్యాదివాక్యములఁ జెప్పియున్నట్లు, ప్రారబ్ధ దుష్కృతములనుండి భయమును పోగొట్టుటయగుటం జేసియును 'రత్నపర్వతమారుహ్య యథారత్నం నరోమునే సత్వానురూపమాదత్తే తథాకృష్ణాన్మనోరథాన్ సంకల్పాదేవ భగవాన్ తత్త్వతో భావితాత్మనాం వృత్తాంతమఖిలం కాలం సేచయత్యప్యుతేనతు' (రత్నముల పర్వతము నెక్కినను తనశక్తికొలదియే రత్నములఁ గొనివచ్చునట్లు, అట్లే భగవంతునివలన తనకోరికలను నెరవేర్చుకొనును. సంకల్పమువలననే భగవంతుండు తనను శరణుజొచ్చినవారినడవడికను పరిశుద్ధపఱచుచున్నాడు) ఇత్యాదివాక్యములఁ జెప్పియున్నట్లు కైంకర్య మనోరథమునకు భంగము గలుగక పోవుటం జేసియును, జీవించియున్న కాలములో మనకు సంభవించునవి యన్నియును ప్రియంబులును హితంబులునని తలంచుకొని సంతోషపడునది యనుట. 'ప్రియమితరదథాపి యద్యథావితరసి వరదప్రభో త్వంహిమే తదనుభవనమేవ యుక్తంహిమే త్వయినిహిత భరోస్మి సోహంయతః'

(నమక్కుప్పర మెయ్యిలదే) ఎన్నదు సర్వజ్ఞనుమాయ్

సర్వశక్తికనుమాయ్ పరమకారుణికనుమాయ్ పరను శేషియా

న పెరుమాళ్ భరన్వీకారమ్పణ్ణి దేహయాత్రైయై నమ్ముడై

య కర్మానుగుణమాక నడత్తుకైయాలుమ్ ఆత్మయాత్రైయై

తమ్ముడైయ ప్రధానరూప కృపానుగుణమాక నిర్వహిక్కైయా

లుమ్ 'జనార్దనం ప్రణిపతితో నసీదతి। న వాసుదేవభక్తానా

మశుభం విద్యతే క్వచిత్। న క్రోధో నచ మాత్సర్యం నలోభో

నాశుభామతిః। భవంతి కృతపుణ్యానాం భక్తానాం పురుషో

త్తమే' ఇత్యాదికళిల్పడియే బుద్ధిపూర్వకమాక అపాయంగళి

లన్వయమొణ్ణామైయాలుమ్ప్రవృత్తంగళాకిల్ ఏదేను మొరుకణ్ణ

న్వీవు శెయ్దు విడుకైయాలుమ్ పరావర తత్త్వవివేకత్తాలే పర

తంత్రకర్తృత్వప్రతిపత్తియై యుడైయనుమాయ్ నకించనా

కించనాధికారి వివేకత్తాలే న్యస్తభరనుమాన నమక్కు ఆత్మ

రక్షార్థమాక ఇఙ్గొరుకర్తవ్యవిశేషమిల్లై ఎన్నపడి.

'ఓవరదరాజా! ప్రియమునుగాని యప్రియమునుగాని నీవుదే నిఁ గలుగఁజేసినను నావిషయమగు సమస్తభారమును నీపై యుంచియున్నట్టి నాకు వాటిననుభవించుటయే యుక్తము' అని కదా పూర్వాచార్యులున్ను సాయించియున్నారు.

'నమక్కుప్పర మొన్ఱిలతే= మనకు అంతకుపైన చేయ పలసినదిలేదు కదా' అనఁగా సర్వజ్ఞుండును, సర్వశక్తియును, పరమకారుణికుండును, పరమశేషియునగు భగవంతుడు మన రక్షణభారము నంతయును తనపై బెట్టుకొని మనదేహయాత్రను మన కర్మానుగుణముగ నడిపించుటం జేసియును, ఆత్మయాత్రనన్ననో, తనయొక్క ప్రధానంబగు కృప కనుగుణముగ నిర్వహించుకొని పోవుటంజేసియును 'జనార్దనం ప్రణిపతితో నసీదతి' (భగవంతుని శరణుజొచ్చినట్టివాఁడు కష్టపడడు) అనియు 'నవాసుదేవభక్తానా మశుభం విద్యతేక్వచిత్ । నక్రోధోనచమాత్సర్యం నలోభోనాశుభామతిః' (వాసుదేవుని విషయమున భక్తిగలవారికి అశుభము కలుగదు. క్రోధముగాని, మాత్సర్యముగాని, లోభముగాని, అమంగళమగు బుద్ధిగాని యిపి యట్టివారి కెన్నటికిన్ని కలుగవు) అనియు, ఈ మొదలగు తావులఁ జెప్పియున్నట్లు బుద్ధిపూర్వకముగ నపాయంబులలోఁ బడనీయక పోవుటంజేసియును, ఒకవేళ, అట్లు అపాయంబులలోఁ బడుట తటస్థించినట్లయిన ఏదైననొక స్వల్పశిక్షనొనర్చి వాటినుండి తప్పించుటంజేసియును పరావరతత్త్వముల విషయమగు వివేకముచే మన మొనర్చునది యంతయును వాని సంకల్పమున కధీనంబైనది యనెడి యధ్యవసాయముగలవారమై సకించనా కించనాధికారి వివేకముచే మన

ఇనిప్పిఅవాన్ ఎన్నుమ్ నమక్కు-ఎన్నుమ్ బహువచన ప్రయోగత్తాలే 'పశుర్మనుష్యః పక్షీ వా యేచ వైష్ణవసంశ్రయాః తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పద' మిత్యాదికళిల్ప డియే అనుబంధిరక్షణ మిఙ్గే సూచిత మాకిఱదు.

౧. 'ఒరుజీవను క్కొరుజీవ న్తంజమల్లన్' ఎన్నదు

శ్లో॥ స్వయమ్మృత్పిండభూతస్య పరతంత్రస్య దేహినః'
స్వరక్షణేప్యశక్తస్య కో హేతుః పరరక్షణే॥

శ్లో॥ బ్రహ్మాణం శితికంఠం చ యాశ్చాన్యా దేవతాః స్మృతాః
ప్రతిబుద్ధా న సేవంతే యస్మాత్పరిమితం ఫలం॥

శ్లో॥ ఆసన్నజ్ఞానవిరహా దశుద్ధా దేవతాగణాః।
బ్రహ్మేశానాదయస్సర్వే స్వస్వాతంత్ర్యేణగర్వితాః॥

శ్లో॥ అన్యేతుపురుషవ్యాఘ్ర చేతసో యే వ్యపాశ్రయాః।
అశుద్ధాస్తేస్సమస్తాస్స్యుః దేవాద్యాః కర్మయోనయః॥

రక్షణభారమునంతయును వానిపై యుంచినట్టి మనకు మన యొక్క రక్షణవిషయమై మనమెద్దియును చేయనక్కఱ లేదు.

‘ఇనిప్పిరవామ్=ఇంక మరల జన్మింపము’ ‘నమక్కు= మనకు’ అనుతావులనుండు బహువచన ప్రయోగముచే ‘పశుర్మనుష్యః పక్షీవా యేచ వైష్ణవ సంశ్రయాః । తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమంపదం’ (పశువుగాని, మనుష్యుండుగాని, పక్షిగాని యేదియైనను వైష్ణవసంబంధము గలదియైనట్లయిన, నందుమూలముగానే యది పరమపదమును బొందగలదు) ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు భగవద్భక్తులకేగాక వారి సంబంధముగలవారికిన్ని మోక్షము గలుగఁగలదని యీతావున సూచితమగుచున్నది.

౧. ఒకజీవునికి వేఱొక్క జీవుండు రక్షకుండు కాఁడు. దీని యభిప్రాయ మేమనగా—

తా॥ తానే మృత్పిండమువలె పరతంత్రుండైనట్టి జీవుండు తనను తాను రక్షించుకొననేరని స్థితిలోనుండఁగానే తండు ఇతరులను రక్షించుట యెట్లు?

తా॥ బ్రహ్మరుద్రాదుల నాశ్రయించుటచే లభించునట్టి ఫలము పరిమితంబై నదియైనందున జ్ఞానులు వారిని సేవింపరు.

తా॥ భగవంతునికే యనన్యార్హ శేషభూతుల మనెడి జ్ఞానము లేనందున బ్రహ్మరుద్రాదులు పరిశుద్ధులుగారు. వారు స్వాతంత్ర్యరూపమగుదోషముమూలముగ తిరస్కృతులు.

తా॥ మనస్సుచేఁ దలంపఁగూడనివారును, కర్మమూలముగ జన్మించినవారలగు దేవాదులందఱును అపరిశుద్ధులు.

శ్లో॥ ఆబ్రహ్మస్తంబపర్యంతా జగదంతర్వ్యవస్థితాః।
ప్రాణినఃకర్మజనిత సంసారవశవర్తినః॥

శ్లో॥ యతస్తతోన తేజ్ఞానే జ్ఞానినాముపకారకాః।
అవిద్యాంతర్గతాస్సర్వే తేహిసంసారగోచరాః॥

శ్లో॥ పశ్చాదుద్భూతబోధాశ్చ ధ్యానేనైవోపకారకాః॥
నైసర్గికోసనైబోధస్తేషామప్యన్యతోయతః॥
శ్లో॥ పశవఃపాశితాఃపూర్వం పరమేణ స్వలీలయా।
తేనైవమోచనీయాస్తే నాన్యైర్మోచయితుంక్షమాః॥

ఇత్యాదికళిఱ్పడియె పగతంత్ర చేతనర్కళిల్ ఆరేను మొరువర్ తఙ్గళుక్కిప్పడియిరుక్కుమ్ నిరపేక్ష రక్షకనాకమాట్టా నెన్ఱపడి.

౨. శ్రీమాన నారాయణ నొరువనుమే సర్వజీవర్కళుక్కుమ్ తంజమ్' ఎన్ఱదు.

శ్లో॥ శ్రీమన్నారాయణ స్వామిన్ననన్య శరణస్తవ।
చరణౌశరణం యాతి స్తవైవాస్యహముచ్యత॥

శ్లో॥ మామేవయేప్రపద్యంతే మాయామేతాంతరన్తితే।

శ్లో॥ తమేవచాద్యంపురుషంప్రపద్యే
యతఃప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

తా॥ చతుర్ముఖబ్రహ్మను మొదలుకొని యీబ్రహ్మాండమునులోనుండునట్టి సమస్తజీవరాశులును కర్మమూలముగ సంసారమునఁ బడియుండువారు.

తా॥ అవిద్యలోనుండునట్టి వారందఱును సంసారమునఁ బడియుండునట్టివారు వారు. జ్ఞాననిష్ఠులు కానందున జ్ఞానుల కుపకారకులు కారు.

తా॥ తరువాత గలిగినట్టిబోధలు స్వతస్సిద్ధములు కాక, యితరులనుండి కలిగినవిగాన, నవి ధ్యానమున నుపయోగపడవు.

తా॥ ఈజీవులందఱును ఇంతకుముందు భగవంతునిచే స్వలీలార్థము సంసారబంధమున నుంచబడియున్నారు. కావున వానిచేతనే యట్టిబంధము విడిపింపబడ వలయునుగాని యితరులచే నది విడిపింప శక్యము కాదు.

ఈ మొదలగు ప్రమాణములయందుఁ జెప్పియున్న ప్రకారము పరతంత్రులగు ఈ జీవాత్మలలో నొక్కండు వేఱొకనికి రక్షకుండు కాజాలఁడు.

౨. శ్రీమానగు నారాయణుండే జీవులందఱికిని రక్షకుండు. దీని యభిప్రాయమేమనఁగా—

తా॥ శ్రీమన్నారాయణా! స్వామీ! నేను వేఱొకరక్షకుండులేనివాఁడను. నీ శ్రీపాదములనే యుపాయముగా నమ్మియున్నవాఁడను నేను నీకు శేషభూతుండను.

తా॥ ఎవ్వరు నన్ను శరణుజొచ్చుచున్నారో వారు యీమాయనుండి విడదలయగుచున్నారు.

తా॥ జగత్త్రయమును సృజంచినట్టివాఁడగు ఆదిపురుషునే నేను శరణు జొచ్చుచున్నాను.

శ్లో॥ తమేవశరణంగచ్ఛ సర్వభావేనభారత।
తత్ప్రసాదాత్పరాం శాంతింస్థానంప్రాప్స్యసి శాశ్వతం॥
శ్లో॥ సంసారార్ణవమగ్నానాం విషయాక్రాంతచేతసాం।
విష్ణుపోతంవినానాన్యత్ కించిదస్తిపరాయణం॥
శ్లో॥ సంసారసాగరంఘోర మనంతక్లేశభాజనం।
త్వామేవశరణంప్రాప్య నిస్తరంతిమనీషిణః॥
శ్లో॥ సర్వలోకశరణ్యాయ రాఘవాయమహాత్మనే।
నివేదయతమాంక్షిప్రం॥

ఇత్యాదికళిల్ప్పడియే సత్యసమ్పూర్ణగుణవిశేష విశిష్టనాన నారాయణనొరువనుమే అకించనరాయుమ్ సంచనరాయుముళ్ళ సర్వజీవర్కళుక్కుమ్ స్వబుద్ధ్యధీన సహకారత్వ తిరస్కాపేక్షార హితమాక అనిష్టనివృత్తియైయుమ్ ఇష్టప్రాప్తియైయుమ్ పణ్ణువ నెన్ఱుపడి. ఇవనైప్పఱ్ఱినవర్కళై ఒరువరుమ్ బాధిక్కమాట్టాద పడియైయుమ్ స్వభావతస్సర్వసమనాయ్, 'నమేద్వేష్యో஽స్తి'ఎన్ఱవిననుక్కు ద్వేష్యరాన్ప్రసాపరాధరానారైయొరువరుమ్ రక్షిక్కమాట్టాదడియైయుమ్ [1]'గజంవావీక్ష్య సింహంవా' [2]'బ్రహ్మస్వయంభూః' ఎన్నిఱ శ్లోకత్తిల్ తాత్పర్యత్తిలుమ్ ప్రహ్లాద సుముఖకాక రావణాది వృత్తాంతఙ్గళిలుమ్ కండుకొళ్‌వదు,

---

(1) శ్లో॥ గజంవావీక్ష్య సింహంవావ్యాఘ్రంవావనమాశ్రితా। నాహారయతిసంత్రాసం బాహూరామస్యసంశ్రితా॥ తా॥ శ్రీరామచంద్రుని శరణు జొచ్చినట్టిజంతు వెద్దియైనను వనమందలి గజసింహాదులనుండి భయపడదు.

(2) శ్లో॥ బ్రహ్మస్వయంభూశ్చతురాననోవా రుద్రస్త్రినేత్ర స్త్రిపురాంతకోవా। ఇంద్రోసరేంద్రస్సురనాయకోవా త్రాతుంనశక్తా ఇతిరామవధ్యం॥

తా॥ భగవంతునిచే నశింపఁజేయఁదలంచినట్టివానిని బ్రహ్మరుద్రేంద్రాదులలో నెవ్వండును రక్షింపంజాలఁడు.

తా॥ఓయర్జునా! అట్టి భగవంతునే శరణుజొచ్చువాని యనుగ్రహమువలన శాంతిని పరపదమునున్ను పొందగలవు.

తా॥ సంసార సముద్రమునంబడియుండి శబ్దాదివిషయ మగ్నంబైనట్టి మనస్సుగలవారికి విష్ణువనంబడు ఓడతప్ప వేఱొక్కటి రక్షకంబు కాఁజాలదు.

తా॥ ఈసంసార సముద్రము లెక్కలేని కష్టంబుల కాకరంబయినది. స్వామీ! జ్ఞానులు నిన్ను శరణుజొచ్చి దీనినతిక్రమింపగలరు.

తా॥ అందఱినిన్ని రక్షించుటకై సన్నద్ధుండై యున్నట్టి శ్రీరామచంద్రుని సముఖమున నేను శరణుజొచ్చినానని వెంటనే తెలుపుడు.

ఇత్యాదితాత్పులఁ జెప్పియున్నట్లు పత్నీసంబంధ గుణ విశేష విశిష్టుండగు నారాయణుండొక్కండే, అకించనులుగాను సకించనులుగాను నుండునట్టి సమస్తజీవులకును స్వబుద్ధ్యాధీన సహకార్యతిరిక్తాపేక్షా రహితముగ అనఁగా వారువారు కోరవలసినది తప్ప వేఱొక్కటి చేయనక్కఱలేకుండ అనిష్టనివృత్తినిన్ని ఇష్టప్రాప్తినిన్ని జేయఁగలడనుట. ఈతనిని ఆశ్రయించినట్టివారి నితరులెవ్వరును బాధింపజాలరను విషయమును, స్వభావసిద్ధముగ సర్వసముండై ‹నమేద్వేష్యోస్తి› (నాకు శత్రువు లెవ్వరును లేరు) అన్నట్టియీతనికి ద్వేష్యులనఁ బడునట్లు అపరాధయుక్తులైనట్టివారి నొక్కరున్ను రక్షింపజాలకుండుటనున్ను ‹గజంవా వీక్ష్యసింహంవా' ‹బ్రహ్మాస్వయంభూః›అనుశ్లోకములయొక్కతాత్పర్యార్థమునందును, ప్రహ్లాద, సుముఖ, కాకాసుర, రావణాదులచరిత్రలయందుఁ దెలియఁదగును.

3. ‘ఇజ్జీవన్ అనాదికాలం అనుభవిత్తు పోరాద శ్రియఃపతియై పెఱుకైక్కు హేతువానవుపాయత్తై రహస్యత్రిమముఖత్తాలే ఉపదేశిత్తు అవ్వళియాలే ఆచార్య నివనుక్కుత్తంజమాక్కినార్’ ఎన్ఱదు.

‘దాసభూతా స్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః’ ఇత్యాది కళిప్పడియే సూరికళోడొక్క స్వరూపయోగ్యతై ఉణ్డాయిరుక్క స్వాపరాధత్తాలే స్వతః ప్రాప్తమాన భగవదనుభవత్తై యిళన్ద సంసారిచేతనన్ ఇప్పేఱుపెఱుకైక్కు అవినాభావత్తాలే విశ్వసనీయమాన ఉపాయవిశేషత్తై అధ్యాత్మ శాస్త్రసారమాన మూలమంత్రాదికళాలే ఉపదేశిత్తు ‘ఆచార్యః ప్లావితా తస్య జ్ఞానం ప్లవ ఇహోచ్యతే॥ సాక్షాన్నారాయణో దేవః కృత్వా మర్త్యమయీం తనూమ్।మగ్నా నుద్ధరతే లోకా న్కారుణ్యా చ్ఛాస్త్రపాణినా’ ఇత్యాది కళిప్పడియే ఆచార్య నివనుక్కు పరంపరయా మోక్షసాధన మాక్కినా నెన్నపడి. ‘పాపిష్ఠః క్షత్రబన్ధుశ్చ పుణ్డరీకశ్చ పుణ్యకృత్’

3. ఈజీవుండు అనాదికాలముగ అనుభవించుటకు
ంవని శ్రియఃపతిని అట్లు లభించుటకు హేతువగు ఉపాయ
ను రహస్యత్రయముద్వారా యుపదేశించుటచే నందు
ాలముగ ఆచార్యుండు యీజీవునికి రక్షకుండగుచున్నాడు.

దీనియభిప్రాయమేమనఁగా

'దాసభూతాస్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః'
ముస్తములను ఆత్మలుసర్వేశ్వరునికిదాసభూతులు) అన్న
నిత్యసూరులతోఁబాటు భగవంతుని యనుభవించుటకుస్వ
పసిద్ధముగ యోగ్యతయున్నప్పటికిన్ని తానొనర్చియున్నట్టి
పరాధంబులమూలముగ దానిఁబోగొట్టుకొనినట్టి సంసారి
గుజీవుండు ఈఫలమునులభించుటకు ఎన్నటికిని విడువకుండ
ర్మయుండవలసినదియగు ఉపాయ (ప్రపత్తి) స్వరూపమును
ాంతశాస్త్రసారంబగు తిరుమంత్రాదులమూలముగ ఉపదే
చి, 'ఆచార్యః ప్లావితాతస్య జ్ఞానంప్లవఇహోచ్యతే। సాక్షా
రాయణోదేవః కృత్వామర్త్యమయీంతనుం।మగ్నానుద్ధ
ిలోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా'(ఆచార్యుండు నావికుని
టివాఁడు వానిజ్ఞానము నావ(పడవ)వంటిది ,సాక్షాత్తుగనారా
ముండే నరశరీరమును ధరించివచ్చి శాస్త్రమును చేతంబట్టు
) దానిమూలముగ సంసారసాగర మగ్నులైనట్టి వారినుద్ధ
కుటకై వచ్చినాడని యాచార్య నెఱుంగువది) ఇత్యాదిశా
ంఁ జెప్పియున్నట్లు ఆచార్యుండు ఈజీవునికి క్రమేణ మోక్ష
కము కాఁగలడనుట,'పాష్టః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చపుణ్యా
న్। ఆచార్యవత్తయాముక్తౌ తస్మా దాచార్యవాన్ భవేత్'
పిష్టుండగుక్షత్రబంధువును పుణ్యాత్ముండగు పుండరీకుండును

ఆచార్యవత్తయా ముక్తౌ తస్మా దాచార్యవాన్భవేత్' ఎన్గిర
ఉక్కిమిదువే తాత్పర్యమ్.

౪. సర్వస్వామినియాయ్ సర్వేశ్వరనుక్కు శేష
మాయ్ సహధర్మచారిణియాన పెరియపిరాట్టియార్ ఇత్తై
యిల్ వాత్సల్యాతిశయత్తాలుమ్ అత్తైయిల్ వాల్లభ్యాతి
శయత్తాలుమ్ పురుషకారమాయ్ క్కొణ్డు ఇజ్జీవర్కళుక్కు
త్తంజమాకిఱాళ్ ఎన్గిరదు.

శ్లో॥ సర్వేషా మేవ లోకానా మీశ్వరీ మమవల్లభా।
అస్యా మమచ శేషంహి విభూతి రుభయాత్మికా॥

శ్లో॥ దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్హరిః।
స్త్రీనామ్నీలక్ష్మీర్మైత్రేయ నాన యోర్విద్యతేపరమ్॥
నిత్యైవైషాజగన్మాతా విష్ణోశ్శ్రీ రనపాయినీ।

శ్లో॥ యజ్ఞవిద్యా మహావిద్యాగుహ్యావిద్యాచ శోభనే।
ఆత్మవిద్యాచదేవిత్వం విముక్తిఫలదాయినీ॥

శ్లో॥ ఇయంసీతా మమసుతా సహధర్మచరీతవ।
సర్వైశ్వర్యగుణోపేతా నిత్యంతద్ధర్మధర్మిణీ॥

శ్లో॥ కరుణాపూనతముఖీ కమలాక్షీ శశిప్రభా।
కల్యాణవాహినీకల్యా కలికల్మషనాశినీ॥

ఆచార్యుని యాశ్రయించి యుండుటచేనే ముక్తిని బొందినారు కావున నాచార్యుని యాశ్రయించినవారు కావలసినది) అని తెలుపునట్టిశ్లోకముయొక్క యభిప్రాయమున్న ఈపైని గనం బఱచినదియె.

౪. సర్వస్వామినియై, సర్వేశ్వరునికి శేషమై, సహధర్మచారిణియగు పెరియపిరాట్టి యీజీవునియెడల యెక్కువ వాత్సల్యముగలది యగుటంజేసియును, సర్వేశ్వరునికి యెక్కువ ప్రియురాలగుటంజేసియును పురుషకారభూతురాలై జీవులకు రక్షకురాలగుచున్నది.

దీని యభిప్రాయమేమనంగా—

తా॥ నాపత్నియగు శ్రీదేవిసమస్తలోకముల కధిపతురాలు విభూతులు రెండును మాయుభయులకును శేషభూతములు.

తా॥ ఓమైత్రేయ! దేవ తిర్యఙ్మనుష్యులలో పురుషుండు సర్వేశ్వరుండు స్త్రీ లక్ష్మిదేవి. ఈమె విష్ణువును యెన్నడును విడనాడక యుండునది.

తా॥ ఓదేవి యజ్ఞవిద్యాదులును మోక్షప్రదంబగు బ్రహ్మవిద్యయు నన్నివిద్యలును నీవే.

తా॥ ఓరామచంద్రా? నాకుమార్తెయగు సీతాదేవి నీతోంబాటుగ ప్రవర్తించునది. సర్వైశ్వర్య గుణములుగలదియై నిత్యము తదనుగుణముగ ప్రవర్తించునది.

తా॥ ముఖమునందే కారుణ్యము తెలియ వచ్చునదియు, కొంచము తలవంచుకొనినదియు, పద్మములవంటి నేత్రములు గలదియు, చంద్రునివలె నాహ్లాదకరంబైనదియు, మంగళకరురాలును, కలిదోషమును నశింపంజేయునదియును.

శ్లో॥ సర్వార్తివిచ్ఛేదకరీ సర్వేష్టాపరిపూరికా॥

శ్లో॥ ఆర్యాయాశోదాపనుదా ధర్మకామార్థమోక్షదా।
అప్రమేయక్రియాసూక్ష్మా పరనిర్వాణదాయినీ॥

శ్లో॥ వాచః పరం ప్రార్థయితా ప్రపద్యే నియతశ్శ్రియమ్॥

శ్లో॥ ప్రాయశ్చిత్తప్రసంగేతు సర్వపాపసముద్భవే।
మామేకాం దేవదేవస్య మహిషీం శరణం వ్రజేత్॥

శ్లో॥ సర్వకామప్రదాం రమ్యాం సంసారార్ణవతారిణీం।
క్షిప్రప్రసాదినీం లక్ష్మీం శరణ్యామనుచింతయేత్॥

శ్లో॥ ప్రణిపాతప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా॥

శ్లో॥ అలమేషాపరిత్రాతుం రాక్షస్యోమహతోభయాత్॥

శ్లో॥ అలమేషాపరిత్రాతుం రాఘవాద్రాక్షసీగణమ్॥

ఇత్యాదికళిల్ శ్లోకన్గళ్ సర్వశేషివ్యతిరిక్త సర్వశేషిత్వమ్ నిగ్రహాసమానాధికరణ సర్వానుగ్రహాపత్త్వమిత్యాది స్వభా

తా॥ ఈమె సమస్తకష్టములను పోగొట్టునది. సర్వేష్టములను చేకూర్చునది.

తా॥ పూజ్యురాలును, కీర్తినిచ్చునదియును, ధనమునిచ్చునదియును, ధర్మకామార్థమోక్షంబుల నిచ్చునదియును, వాచామగోచరంబులగు పనులఁ జేయునదియును, సూక్ష్మమైనదియును మోక్షప్రదయును.

తా॥ భగవంతుని ప్రార్థించునట్టి నేను లక్ష్మీవిశిష్టుండగు భగవంతుని శరణు జొచ్చుచున్నాను.

తా॥ సర్వపాపంబుల నొనర్చినందున ప్రాయశ్చిత్తము నొనర్చుకొనవలసినప్పుడు దేవదేవుండగు భగవంతునికి పత్నియగు నన్ను శరణుజొచ్చునది.

తా॥ సమస్తకోరికలను నెరవేర్చునదియు,సంసారసముద్రమును దాటించునదియు, శీఘ్రముగ అనుగ్రహించునదియు, శరణ్యురాలగు లక్ష్మీదేవిని స్మరించుకొనునది.

తా॥ సీతాదేవి దండము సమర్పించినంత మాత్రమున ననుగ్రహించునది.

తా॥ రాక్షసులను గొప్పభయమునుండి రక్షించుట కీమే సమర్థురాలు.

తా॥ శ్రీరామచంద్రునినుండి రాక్షసగణమును రక్షించుట కీమే సమర్థురాలు.

ఈపైని గనఁబఱచినవి మొదలగు ప్రమాణములయందుఁ దెలిపియున్నట్లు, సర్వశేషియగు భగవంతునికితప్ప తక్కిన వారికందఱికిని యీమెయున్ను శేషియగుటను, నిగ్రహంబనునది యెంతమాత్రము లేకుండ యందఱినిన్ని యను

ఴవిశేషఙ్గళై యుడైయవళాన పిరాట్టి సాపరాధరానవర్కళై ళ్లారుక్కుమ్ శాసితావాన సర్వేశ్వరన్ అభిమతఙ్కొళ్ళమాట్టాదే తయఙ్గాదపడి యవనుడైయ పితృత్వ ప్రయుక్తమాన ఔష్మళీభావత్తై , 'ఉచితైరుపాయైర్విస్మార్య' ఎన్ఱుమ్పడియాక్కి ఇవర్కళై యవన్ తిరువడికళిలే శేర్త్తు,తన్నడియార్ తిరత్తకత్తు త్తామరైయాళాకిలుమ్ శిదకురైక్కుంమేల్ ఎన్నడియా రదుశెయ్యార్, ఎన్ఱుమ్పడి పణ్ణిక్కొణ్డు , 'భవేయం శరణంహివః' ఎన్ఱరుళిచ్చెయ్దపడియే ఇవర్కళుక్కు రక్షా హేతువాకిఱాళెన్ఱపడి.

౫౧. ఇవళై పురుషకారమాక్క వేణ్డుకిఱదు ఈశ్వరన్ దణ్డధరనాకైయాలే. ఎన్నదు

అప్రమేయోనియోజ్యశ్చ యత్రకామగమో వశీ ।
స్వాతంత్ర్య మైశ్వర మపర్యనుయోజ్య మాహుః' ఇత్యాదికళిల్పడియే నిరంకుశ స్వతంత్రనాన సర్వేశ్వరన్ ,'తస్మాచ్ఛాస్త్రంప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ' ఎన్ఱుక్షేత్రజ్ఞరుక్కు

గ్రహించుటయే ప్రధానముగాఁ గలది యగుటయును, ఈమొదలగు స్వభావంబులఁ గలిగియున్నట్టిది యగు పిరాట్టి సాపరాధులగు చేతనుల నందఱిని శిక్షించునట్టి వాఁడగు సర్వేశ్వరుని యిష్టంబెద్దియో యడిగి తెలిసికొనకయే నిరర్థ్యాంతరముగ వానికిఁగల పితృత్వమును బట్టియుండునది యగు నిగ్రహమును 'ఉచితైరుపాయైర్విస్మార్య' (ఉచితంబులగు ఉపాయంబులచేమఱపించి) అని సాయించినట్లొనర్చి, వీరిని వాని శ్రీపాదములయందుఁ జేర్చి, 'తన్నడి కూర్ తిరుత్తకత్తు తామరై యాళ్లున్ శిదకురైక్కుం మేల్ ఎన్నడియారదు శెయ్యార్' (ఇట్లు యీచేతనులను సర్వేశ్వరునితోఁ జేర్చినట్టి పిరాట్టియైనను అటు పిమ్మట వారిపై నెపముబెట్టినట్లయిన. నాదాసులట్లు చేయరని నిరాకరించువాఁడు) అన్నట్లొనర్చి, 'భవేయం శరణం హి వః' (మిమ్ములను రక్షించెదను) అని సాయించినట్లు వీరిని సర్వేశ్వరుండు రక్షించుటలో హేతుభూతురాలు కాఁగలదనుట.

౫. ఈశ్వరుండు దండించునట్టివాఁడగుటం జేసి యీమెను పురుషకారముగాఁ గొనవలసి వచ్చినది.

దీని యభిప్రాయమేమనఁగా—

'అప్రమేయోఽనియోజ్యశ్చ యత్రకామగమో వశీ స్వాతంత్ర్యమైశ్వరమపర్యనుయోజ్యమాహుః' (సర్వేశ్వరుండు వాచామగోచరుండును, వేఱొకనిచే నియమింపఁబడనివాఁడును, స్వేచ్ఛగ ప్రవర్తించువాఁడును, సర్వమును తనవశమున నుంచుకొనియుండు నట్టివాఁడును. సర్వేశ్వరుని స్వాతంత్ర్యము అడ్డులేనిది) అని చెప్పియున్నట్లు, నిరంకుశస్వతంత్రుండగు సర్వేశ్వరుండు 'తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకా

కృత్యాకృత్య వ్యవస్థాపకమాన శాస్త్రత్తై అనాదియాక ప్రవర్తిప్పిక్క ప్రవాహానాదికర్మ సంయుక్తరాయ్ ఆజ్ఞాతిలంఘనమ్పణ్ణినవర్కళై ఇవన్ 'క్షిపామ్యజస్ర మశుభాన్' ఎన్గిఱపడియే నిగ్రహిత్తుప్పోరుమవనాక ప్రమాణసిద్ధనాకైయాలే స్వాపరాధభూయస్త్తైయాలే భీతరానవర్కళుక్కు ఆర్ద్రస్వభావాదికళాలే అనతిలంఘనీయ వాక్యైయాన విజ్ఞప్తియై పురుషకారమాక్క వేణ్డుకిఱ దెన్నపడి.

౬. ఇద్దణ్డకారణ మనాదియాన ఆజ్ఞాతిలంఘనమ్ ఎన్నదు.

'సమోఽహం సర్వభూతేషు' ఎన్ను సర్వసమనాన సర్వేశ్వరన్ తనక్కు వైషమ్యనైర్ఘృణ్యాదికళ్ వారాదపడి వ్యవస్థిత నిగ్రహాంపణ్ణుకైక్కు విశేషకారణమ్ 'నిమిత్తమాత్రమేవాసౌ సృజ్యానాం సర్గకర్మణి, ప్రధానకారిణీభూతా యుతోవై సృజ్యశక్తయః॥ నిమిత్తమాత్రం ముక్త్వైవ నాన్యత్కించిదపేక్షతే। నీయతే తపతాం శ్రేష్ఠ స్వశక్త్యా వస్తువస్తుతామ్ ర్మభి ర్భావితాః పూర్వైః కుశలాకుశలైః ప్రజాః' ఎన్నుమ్ 'హ

ర్య వ్యవస్థితౌ' (ఇది చేయవలసినది ఇదిచేయకూడనిది యని నిర్ణయించుకొనుటకుగాను శాస్త్రమే యాధారము) అన్నట్లు యీచేతనులకు కృత్యాకృత్యంబులను నిర్ణయించునట్టి శాస్త్రమును అనాదికాలముగాఁ బ్రవర్తింపఁజేయఁగా, ప్రవాహానాదియగు కర్మముతోఁగూడియున్నట్టివారై భగవదాజ్ఞ నతిక్రమించి ప్రవర్తించునట్టి వీరిని యీతండు 'క్షిపామ్య జస్రమశుభాన్' అన్నట్లు శిక్షించునట్టివాఁడుగాను శాస్త్రమునుండి తెలియవచ్చుటంజేసి, తమ యపరాధంబు లెక్కువయైనందున భయపడునట్టివారికి వస్తుస్థితినిబట్టి తనమాటకువ్యతిరిక్తములేనిదియగు విష్ణుపత్నిని పురుషకారముగాఁ గొనవలయుననుట.

౬. దండించుటకు హేతువు ఈచేతనుండు అనాదికాలముగ భగవదాజ్ఞను అతిక్రమించి ప్రవర్తించుటయే.

దీనియభిప్రాయమేమనఁగా—

'సమోహంసర్వభూతేషు' (నేను అందఱియెడలను సమానుండను) అన్నట్లు, సర్వసముండగు సర్వేశ్వరుండు తనకు వైషమ్యము (పక్షపాతము) నైర్ఘృణ్యము (దయారాహిత్యము) మొదలగునవి తటస్థింపకుండునట్లు, ఒకవిధమైనకట్టుబాటుప్రకారము శిక్షించుటకు ముఖ్యకారణము, 'నిమిత్తమాత్రమే వాసౌ సృజ్యానాం సర్గకర్మణి ప్రధానకారణీభూతా యతో వై సృజ్యశక్తయః। నిమిత్తమాత్రం ముక్త్వైవనాన్యత్కించిదపేక్షతే సీయతే తపతాం శ్రేష్ఠ స్వశక్త్యావస్తువస్తుతాం। కర్మభిర్భావితాః పూర్వైః కుశలాకుశలైః ప్రజాః' (సృజింపఁబడునట్టి వస్తువులు తమసృష్టివిషయమున నిమిత్తమాత్రము నపేక్షించునవి. వాటియందుఁగల శక్తులే యందులకు ముఖ్యకారణములు. నిమి

న్యతే తాత కః కేన యత్ర స్స్వకృతభుక్పుమాన్ 'ఎన్నుమ్, శుభే త్వసౌ తుష్యతి దుష్కృతేతు నతుష్యతే ఽసౌ వరమశ్శరీరీ' ఎన్నుమ్ ,నానే నానావిదనరకఙ్ఙళుక్కు ప్పాపం శెయ్ దే' నెన్నుమ్ ప్రమాణసిద్ధమాయ్ ప్రవాహానాదియాన విరుద్ధానుష్ఠానమెన్నపడి.

౨. ఇప్పడి అపరాధానురూపమాక దండధరనాయ్ పోరుకిఱ శరణ్యనుడైయ వశీకరణఙ్గళిల్ ప్రధానమ్ సర్వాకిఙ్ప నాధికారమాన ఆత్మరక్షాభరసమర్పణమ్ ఎన్నదు.

' అనిత్యమసుఖంలోక మిమంప్రాప్య భజస్వమామ్ ' ఎన్నుమ్ ' సర్వధర్మాన్పరిత్యజ్య మామేకంశరణంవ్రజ ' ఎన్నుమ్.

' పితరంమాతరందారా న్పుత్రాన్బన్ధూన్ సఖీన్గురూన్ రత్నానిధనధాన్యాని క్షేత్రాణిచగృహాణిచ॥ సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చసాక్షరాన్ । లోకవిక్రాన్తచరణౌ

త్తమాత్రమును తప్ప వేఱొక్కదాని నపేక్షింపవు, స్వశక్తిచే తనే వస్తువు లాయా శరీరంబులం బొందుచున్నవి. అట్టి నిమిత్తమాత్రములగు శక్తులు వారువారొనర్చినట్టి పుణ్యపాప కర్మంబులే) అనియు 'హన్యతే తాతకః కేన యతః స్వకృతభుక్పుమా౯' (ఎవ్వండు ఎవ్వనిచే బాధింపఁబడుచున్నాఁడు ? వాని వాని కర్మమును వాఁడువాఁడు అనుభవించుచున్నాఁడు) అనియు 'శుభేత్వసౌతుష్యతి దుష్కృతేతు నతుష్యతేసౌ పరమశ్శరీరీ' (ఈచేతనుండు పుణ్యకర్మము నొనర్చినయెడల భగవంతుండు సంతోషించును. పాపకర్మము నొనర్చినయెడల సంతోషింపఁడు) అనియును 'నానే నానావిత నరకంపుకుంవాపం శెయ్ తే' (నేనే నానావిధంబులగు నరకంబులను బొందింపఁజేయునట్టి పాపంబుల నొనర్చినాఁడను) అనియును నిట్టి ప్రమాణంబుల మూలముగఁ దెలియవచ్చునదియై ప్రవాహానాదియగు శాస్త్రవిరుద్ధానుష్ఠానంబనుట.

౨. ఇట్లు అపరాధానుగుణముగ దండించునట్టి సర్వేశ్వరుని వశపఱచుకొనుటకు గానగు వాటిలోఁ బ్రధానంబైనది సర్వాకించనాధికారంబగు ఆత్మరక్షాభరసమర్పణము.

దీని యభిప్రాయమేమనఁగా—

'అనిత్యమసుఖంలోక మిమంప్రాప్య భజస్వమాం (అనిత్యంబును, సుఖరహితంబునగు ఈలోకమున జన్మించి నన్నుభజింపుము) అనియు, 'సర్వధర్మా౯ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ' (అన్నింటిని విడనాడి నన్ను శరణుజొచ్చుము) అనియు, 'పితరం మాతరం దారాన్పుత్రా౯ బంధూ౯ సఖీ౯ గురూ౯ రత్నాని ధనధాన్యాని క్షేత్రాణిచ గృహాణిచ। సర్వధ

శరణం తే వ్రజం విభో' ఎన్నుమ్ 'వృథైవ భవతో యాతా నిష్ఫలా జన్మసన్తతిః। తస్యామన్యతమం జన్మ సంచింత్య శరణం వ్రజ' ఎన్నుమ్ 'అహమస్మ్యపరాధానామాలయోऽకించనోऽగతిః। త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః॥ శరణాగతిరిత్యుక్తా సా దేవేऽస్మిన్ ప్రయుజ్యతామ్। తస్యానుబంధాః పాప్మానః సర్వే నశ్యంతి తత్క్షణాత్' ఎన్నుమ్ 'భక్త్యా పరమయా వాపి ప్రపత్త్యా వా మహామతే। ప్రాప్యోऽహం నాన్యథా ప్రాప్యో మమ కైంకర్యలిప్సుభిః' ఎన్నుమ్ 'శరణం త్వాం ప్రపన్నా యే ధ్యానయోగవివర్జితాః। తేపి మృత్యుమతిక్రమ్య యాన్తి తద్వైష్ణవం పదమ్' ఎన్నుమ్

ర్థాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చసాక్షరాన్ లోకవిక్రాంత చ
రణౌ శరణం తే వ్రజం ప్రభో' (మాతాపితాదిబంధువర్గము
నున్ను, ధనధాన్యక్షేత్రాది సంపత్తునున్ను, సర్వధర్మములను
న్ను, సర్వకోరికలనున్ను విడనాడి నీ శ్రీపాదంబులను శరణు
జొచ్చితిని) అనియు, 'వృథైవభవతో యాతా నిష్ఫలా జన్మనం
తతిః। తస్యామన్యతమంజన్మ సంచింత్య శరణంవ్రజ'(వృథాగా
అనేకజన్మలనెత్తి నావు వాటిలో నొక్క జన్మమునైనను తలం
చుకొని భగవంతుని శరణుజొచ్చుము?) అనియు, 'అహమస్మ్య
పరాధానా మాలయోఽకించనోఽగతిః త్వమేవో పాయభూ
తో మే భవేతిప్రార్థనామతిః। శరణాగతిరిత్యుక్తా సా దేవేస్మిన్ప్ర
యుజ్యతాం। తస్యానుబంధాః పాప్మానః సర్వేనశ్యంతి తత్క్షణాత్'
(స్వామీ! నేను అపరాధభూయిష్ఠుండను, ఎట్టి యోగ్యతయును లేని
వాఁడను, వేఱొక్క మోక్షోపాయము లేనివాఁడను కావున
నీవే యుపాయంబై నన్నురక్షింపుమా యను ప్రార్థన శరణా
గతి యనఁబడును. ఇట్టి శరణాగతిని భగవంతుని విషయమున
నొనర్చునది. అట్లు శరణాగతిచేసిన వానిపాపము లన్నియును
వెంటనే నశించుచున్నవి) అనియు, 'భక్త్యాపరమయా వాపిప్ర
పత్త్యావా మహామతే ప్రాప్యోహంనాన్యథాప్రాప్యోమమకైంక
ర్యలిప్సుభిః'(నాకైంకర్యమునుగోరువారిచే నేనుభక్తిచేఁగానిప్ర
పత్తిచేఁగాని పొందవలసినవాఁడను) వేఱొక్కవిధమునపొందుట
కవకాశములేదు) అనియు, 'శరణంత్వాం ప్రపన్నాయేధ్యాన
యోగవివర్జితాః। తేపిమృత్యుమతిక్రమ్య యాంతి తద్వైష్ణవం
పదం' (భక్తియోగరహితులై నీకు శరణాగతిచేసినట్టివారును
జన్మమరణాది రూపమగు సంసారము నతిక్రమించి పరమపద

ముముక్షువుక్కు శరణ్యప్రసాదనత్తుక్కాక చ్చొల్లప్పట్ట ఉపాయత్తిల్ వైత్తుక్కొణ్డు ‘నిక్షేపాపరపర్యాయో న్యాసఃపంచాఙ్గసంయుతః। సన్న్యాసస్త్యాగ ఇత్యుక్తశ్శరణాగతిరిత్యపి’ ఎన్నుమ్ ‘ఆత్మాత్మీయభరన్యాసో హ్యాత్మనిక్షేప ఉచ్యతే’ ఎన్నుమ్ శొల్లప్పట్ట స్వరూపభరసమర్పణమ్.

‘ఇదం శరణమజ్ఞానా మిదమేవవిజానతామ్। ఇదంతితీర్షతాంపార మిదమానన్త్యమిచ్ఛతామ్॥ తావదార్తి స్తదావాంఛా తావన్మోహ స్తదాఽసుఖం। యావన్నయాతిశరణంత్వామశేషాఘనాశనమ్॥ ప్రపత్తేఃక్వచిదప్యేవం పరాపేక్షానవిద్యతే। సాహిసర్వత్రసర్వేషాం సర్వకామఫలప్రదా॥ ఉపాయభక్తిః

మును బొందుచున్నారు) అనియు నిట్లు ముముక్షువు సర్వేశ్వ
రుని సంతోషపెట్టుటకై సాధభూతంబులుగాను చెప్పఁబడినట్టి
యుపాయంబులలో ‘నిక్షేపాంపరపర్యాయో న్యాసః పంచాంగ
సంయుతః సన్న్యాసస్త్యాగ ఇత్యుక్త శ్శరణాగతిరిత్యపి’ (నిక్షేప
మనఁబడునట్టి న్యాసము అయిదుఅంగములు గలది. అది సన్న్యా
సమనియును, త్యాగమనియును శరణాగతియనియును పేర్కొ
నఁబడుట కద్దు) అనియు ‘ఆత్మాత్మీయభరన్యాసో హ్యాత్మనిక్షేప
ఉచ్యతే’ (ఆత్మాత్మీయంబు లన్నింటిని సర్వేశ్వరునికొప్పగిం
చుట ఆత్మనిక్షేప మనఁబడును) అనియును చెప్పియున్నట్టి
స్వరక్షాభర సమర్పణము.

‘ఇదంశరణమజ్ఞానా మిదమేవవిజానతాం। ఇదంతితీర్ష
తాంపార మిదమానంత్యమిచ్ఛతాం।తావదార్తి స్తదావాంఛా
తావన్మోహ స్తదాఽసుఖ।। యావన్న యాతిశరణం త్వామశేషా
ఘవినాశనం। ప్రపత్తేఃక్వచిద ప్యేవం పరాపేక్షానవిద్యతే।సాహి
సర్వత్రసర్వేషాం సర్వకామఫలప్రదా। ఉపాయభక్తిః ప్రారబ్ధ
వ్యతిరిక్తాఘనాశినీ। సాధ్యభక్తిస్తు సాహంత్రీ ప్రారబ్ధస్యాపిభూ
యసీ। సత్కర్మనిరతాస్సిద్ధాస్సాంఖ్యయోగవిద స్తథా। నార్హన్తి
శరణస్థస్య కలాంకోటితమామపి’ (జ్ఞానులకును అజ్ఞానులకును
సంసారము నతిక్రమించుటకును మోక్షమునుబొందుటకునునిది
యేసాధనము. ఎంతవరకుపాపవినాశకంబగు శరణాగతినిచేయక
యుండెనో, అంతవరకే చింతయును కోరికలును, మోహమును
కష్టమును కలుగఁగలవు. ప్రపత్తి ఫలమునిచ్చుటలో వేఱొక్క
దాని సహాయము నపేక్షించునది కాదు. అది యన్నితావుల
నందఱికొక్కయును అన్నికోరికలను నెరవేర్చునది. భక్త్యపా

 (అరవము

ప్రారబ్ధ వ్యతిరిక్తాఘనాశినీ । సాధ్యభక్తిస్తు సాహంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ। సత్కర్మనిరతాస్సిద్ధాస్సాంఖ్యయోగవిద స్తథా। నార్హంతి శరణస్థస్య కలాంకోటితమీమపి ' ఇత్యాదికళిల్ శొల్లుకిఱపడియే వర్ణవిశేషాది రహితమాయ్ అత్యంతాకించనరుక్కుమ్ అధికరిక్కలాయాలుమ్ ఉపాయాంతరపర్యంత సకల ఫలసాధనమాకైయాలుమ్ ఆర్త్తియిల్ తారతమ్యత్తుక్కను గుణమాక ప్రారబ్ధకర్మత్తైయుమ్ కழிక్కవల్లదాకైయాలుమ్ సుకరమాకైయాలుమ్ దుష్కరపరికరనిరపేక్షమాయ్ సకృత్కర్తవ్యమాకైయాలుమ్ సర్వరుక్కుమ్ స్వాభిమతావిళంబిత ఫలసిద్ధిక్కు ఇదువే ప్రధానమెన్నపడి.

ఇదిల్ సొన్న ప్రపత్తిరూపమాన స్వరక్షాభర సమర్పణమావదు—స్వరక్షణార్థ స్వప్రవృత్త్యభిమాన నివృత్తియోడుమ్ ప్రార్థనైయోడుమ్ కూడిన శరణ్యైకసాధ్య స్వరక్షణాధ్యవసాయవిశేషమ్.

యను ప్రారబ్ధకర్మమునుతప్ప, తక్కిన సంచితాగామి పాప కర్మంబులనుమాత్రమే నశింపఁజేయునది. ప్రపత్తి యన్ననో, ప్రారబ్ధకర్మమునున్ను నశింపఁజేయునది గాన, నిది దానికంటెను బలవత్తరమైనది. కర్మయోగనిష్ఠులుగాని సిద్ధపురుషులుగాని, సాంఖ్యయోగ వేత్తలుకాని శరణాగతినిష్ఠునితో నొకకోటిభాగమంతైనను సమానులు కారు) ఇత్యాదితావులయందుఁ జెప్పియున్నట్లు, వర్ణాశ్రమాది నియమరహితంబై మిక్కిలి యకించనులకున్ను అనుష్ఠింపఁదగియుండుటం జేసియును, ఉపాయాంతరము లొసంగునట్టి ఫలంబులతోఁగూడ సమస్తఫలములను చేకూర్చుటకు సాధనంబగుటంజేసియును, వారివారియార్తికిఁగల తారతమ్యమునుబట్టి ప్రారబ్ధకర్మమునున్ను నశింపఁజేయునది యగుటంజేసియును, సులభసాధ్యంబైనది యగుటంజేసియును, గుహ్యతరంబులగు అంగముల సహాయము నపేక్షింపనిదై యొక్కతూరిమాత్ర మనుష్ఠింపవలసినది యగుటంజేసియును, అంతకన్న తమతమ యిష్టంబులను శీఘ్రముగా నెరవేర్చుకొను విషయమున శరణాగతియే ప్రధానంబైనదియని తెలియఁగునది.

ఈతావునఁ జెప్పఁబడినట్టి ప్రపత్తిరూపంబగు స్వరక్షాభర సమర్పణంబనునది తనను రక్షించుకొనువిషయమున స్వప్రయత్నముగాని, తద్వ్యయమగు అభిమానముగాని వీటిలో నద్దిగను లేకుండ, భగవంతునిప్రార్థించుచు, భగవంతుండొక్కండే రక్షకుండనెడి నిశ్చితజ్ఞానము.

౮. ఇదు సపరికరమాన సకృత్కర్తవ్యమ్ ఎన్గిఱదు.

'సకృత్కృత శ్శాస్త్రార్థః' ఎన్గిఱ సామాన్యప్రాప్తియా లుమ్ 'అవృత్తి రసకృదుపదేశాత్' ఎన్గిఱ విశేష హేతు విల్లా మైయాలుమ్ 'సకృదేవప్రపన్నాయ తవాస్మీతిచయాచతే। అభ యంసర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతంమమ॥ సకృదేవహి శా స్త్రార్థః కృతోయన్తారయేన్నరం । ననుప్రపన్నస్సకృదేవనాథ తవాహమస్మీతిచయాచమానః॥ సకృత్త్వార్థనామాత్రేణాపేక్షి తందాస్యతి' ఇత్యాది ప్రమాణ సంప్రదాయఙ్గళాలుమ్ ప్రపత్తి మంత్రఙ్గళిల్ వర్తమానవ్యపదేశమ్ అనుష్ఠాన కాలాభిప్రాయ

౮. ఇది దీక్షాయోగములతో సహా ఒక్కతూరి మాత్రము అనుష్ఠింపవలసినది.

దీని యభిప్రాయ మేమనఁగా — 'సకృత్కృతశ్శాస్త్రార్థః' (శాస్త్రమున విధింపఁబడినట్టిదానిని ఒక్కతూరియనుష్ఠించునది) అను సామాన్యశాస్త్రము ప్రవర్తించుటం జేసియును, 'ఆవృత్తిరసకృదుపదేశాత్' అను బ్రహ్మసూత్రమునందు ఉపాసనము పదేపదే యుపదేశింపఁబడినందున దానిని పదేపదే యనుష్ఠించునది యని చెప్పుటకు ప్రత్యేకముగ నొక హేతువున్నట్లు, దీనిని పదేపదే యనుష్ఠింపవలయుటకుగాను నట్టి హేతువిద్దియును లేకపోవుటం జేసియును, 'సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే। అభయం సర్వభూతేభ్యో దదామ్యేతద్వ్రతం మమ। సకృదేవహి శాస్త్రార్థః కృతోయం తారయేన్నరం। సను ప్రపన్నస్సకృదేవనాథ తవాహమస్మీతి చ యాచమానః। 'సకృత్ప్రార్థనామాత్రేణా పేక్షితం దాస్యతి' (ప్రపన్నుండు ఒక్కతూరిమాత్రమే నీవాఁడనని ప్రార్థించువాఁడు. అట్టి వారికందరికిని మోక్షము నిచ్చుటయే నాయొక్క దీక్ష. శాస్త్రమున విధింపఁబడినది యొక్కతూరి యనుష్ఠించినంతమాత్రమున ఆజీవుని తరింపఁగలదు. నేను నీదాసుండనని యొక్కతూరి ప్రార్థించునట్టివాఁడు గదా ప్రపన్నుం డనఁబడుచున్నాఁడు. ఒక్కతూరి ప్రార్థించినంతమాత్రమున భగవంతుండు అపేక్షితంబుల నొసంగుచున్నాఁడు) ఇత్యాది ప్రమాణ సంప్రదాయంబుల మూలముగను, ప్రపత్తిమంత్రముల (ద్వయ చరమశ్లోకముల) యందుండు క్రియాపదములు (ప్రపద్యే=వ్రజ అనునవి) వర్తమాన కాలికములుగాఁ బ్రయోగించియుండుటలో ను

